కేశ కుసుమ్
మంచి తలనూనె
అపూర్వ తైలము. మెదడుకి పుష్టి నిచ్చు. దురదను పోగొట్టి, జుట్టు రాలుట నివారించును. కేశాభివృద్ధికి మిగుల మంచిది.
రథోడ్ ట్రేడింగు కంపెనీ,
21, తులసింగమ్ వీధి,
సౌకార్పేట — మద్రాసు 1.




316908


ప్రశస్తమైన
ఆయుర్వేదౌషధములు
శాస్త్రీయమైన 200 రకముల ఆయుర్వేదౌషధములు, పేటెంటు మందులు ఎల్లప్పుడు మా వద్దను, మా ఏజంట్లు అందరివద్దను సిద్ధముగ నుండును.
కేట్లాగు, సలహాలు ఉచితము. ఏజంట్లు కావలెను.
డా॥ లక్ష్మీవరపు సుబ్రహ్మణ్యశాస్త్రి A.V.A.C
రామకృష్ణా ఆయుర్వేద ఫార్మసి,
గాంధీనగరం . బెజవాడ



The Andhra Patrika, Madras, } Regd No. 1118, Vol, 34 No. 137 WEDNESDAY 10th SEPTEMBER 1947 వెల ఒక అణా { Founder: K. Nageswara Rao


# ఢిల్లీ రాష్ట్రమంతా అతి సంక్షుభిత ప్రాంతమని అధికార ప్రకటన

## దుర్మార్గులను కాల్చి చంపడానికి పోలీస్, మిలిటరీ ఉద్యోగులకు విశేషాధికారాలు

### అశాంతిని అణచివేయడానికి ఇండియా ప్రభుత్వ తీవ్ర కృషి

### ప్రజాసహకారాన్ని అర్థిస్తూ పటేల్ విజ్ఞప్తి

న్యూఢిల్లీ, సెప్టెంబరు 8: ఢిల్లీని అతి సంక్షుభిత ప్రాంతంగా ప్రకటించారు. ఇది చాలా ప్రమాదకర ప్రాంతమైందనీ, అందుచేత పోలీసులు గాని, మిలిటరీవారుగాని తుపాకులు కాల్చవలసివస్తే దుర్మార్గులను గురిచూచి వారిని చంపడానికే కాల్చవలెననీ ఆజ్ఞాపించారు.

పంజాబు ప్రజాక్షేమ చట్టం, పంజాబు కల్లోలిత ప్రాంతాల చట్టం ఢిల్లీరాష్ట్రానికంతకూ వర్తిస్తాయని భారతప్రభుత్వప్రకటన తెలుపుతోంది. ఈ ప్రకటన ప్రకారం హత్యా వ్యక్త్యపహరణం, నిర్బంధ మానభంగం, గృహదహనం, దోపిడీ మొదలైన నేరాలను మరణశిక్ష కర్హమైన నేరాలుగా పరిగణింపబడతాయి. అత్యవసర సమయాల్లో స్థానికాధికారులకు తగినన్ని విస్తృతాధికారాలివ్వడమే ఈ ప్రకటన ఫలితం. ఈ ప్రకటనవల్ల అధికారులు సంఘశాంతి భంజకులని తోచినవారిని వారంటులేకుండానే అరెస్టుచేసి నిర్బంధంలో ఉంచడం, వారి గమనాగమనాలను పరిమితం చెయ్యడం, వాహనాలను స్వాధీనం చేసికొనడం, పత్రికలు మొదలైన వానిని అదుపులో పెట్టడం, ప్రజాబాహుళ్యానికి అత్యవసరమనిపించే వస్తువులపై కంట్రోలు విధించడం ఇత్యాది కార్యాలు చెయ్యడానికి వీలవుతుంది. అసిస్టెంటు సబ్ ఇన్‌స్పెక్టరు హోదాకు తగ్గని ఏ పోలీసు ఉద్యోగినైనా మేజస్ట్రేటు హాజరుగా లేకపోయినా ఏ అక్రమ సంఘాన్నైనా చెదరగొట్టవచ్చు.

144 సెక్షను ప్రకారం ఢిల్లీ పట్టణంలో తమ అనుమతిలేని మీటింగులు జరుపగూడదనీ, ఎవరయినా సరే లాఠీలు, మొదలైన ఆయుధాలు ధరించరాదనీ, సిక్కులు కూడా 9 అంగుళాలకు మించిన కృపాణాలను ధరించరాదనీ ఢిల్లీ మేజస్ట్రేటు ఉత్తరవులు జారీ చేశారు. ఆ సిక్కులుగూడా మత విషయకంగా తాము ధరించే కృపాణాలను ఒరలలో పెట్టుకునే ఉండాలిగాని బయటికి తియ్యకూడదు.

అక్రమ చర్యలకు పూనుకొనే దుర్మార్గులు ఎవరైనా విరుద్ధంగా ప్రవర్తించినప్పుడు పోలీసులు వారిని కాల్చడానికే కాక చంపడానికే కాల్చాలని ఉత్తర్వులు జారీ అయ్యాయి. పోలీసు దళాలు మరింత శక్తివంతంగా పనిచెయ్యడానికి మరికొన్ని కొత్త సంస్కరణలు కూడా చేశారు. కేవలం న్యూఢిల్లీ ప్రాంతపు సంరక్షణకు గాను మరొక సీనియర్ పోలీసు సూపరింటెండెంటును నియమించారు. ఢిల్లీ రాష్ట్రమంతటిలోనూ పోలీసుదళాలు సదా సంసిద్ధంలో ఉంచుకొని నడిపించడానికి పోలీస్ ముఖ్యాధికారి నొకరిని నియమించారు. ఢిల్లీ పరిరక్షణకై అదనపు మిలిటరీ దళాలు చాలావచ్చాయి. ఇంకా కొన్ని రాబోతున్నాయి.

### పటేల్ విజ్ఞప్తి

ప్రజలూ, పోలీసులూ, సివిలు ఉద్యోగులూ సమష్టిగా కృషిచేసి ఢిల్లీ శాంతిని సత్వరంగా కాపాడాలని కోరుతూ సర్దార్ పటేల్ ఇవ్వాళ మధ్యాహ్నం కూడా మళ్ళీ విజ్ఞప్తి చేశారు.

'ఈ పట్టణానికి వచ్చిన మహా ప్రమాదం జనసామాన్యానికి కంతకూ తెలుసునని నేను నమ్ముతున్నాను. ఇప్పటి అశాంతి వలన ఈ పట్టణపు కీర్తి ప్రతిష్ఠలు తీవ్రహానికి గురిఅవుతున్నాయని నేను చెప్పనక్కరలేదు. ఇటువంటి పరిస్థితిలో మనలో ప్రతివారూ కృషిచేసి దుర్మార్గులను నిర్మూలించడంలో ప్రభుత్వానికి సహాయం చెయ్యాలి. ఇల్లా చెయ్యడంవలన ఈనాడు మనం అదనంగా పూనుకొన్న మహా కార్యం, పశ్చిమ పంజాబ్‌లో వివిధప్రాంతాల్లో దారుణమైన బాధలుపొంది దిక్కులేక అల్లాడుతున్న మన సోదర సోదరీ మణులను రక్షించే కార్యం సంపూర్తిగా నిర్వహించడానికి పరోక్షంగా ఉపకరించినవాళ్ళమవుతాము.

అందుచేత ఇటువంటి క్లిష్టసమయంలో ఢిల్లీ ప్రజలు కల్లోలాలను అణచివెయ్యడంలో ప్రభుత్వానికి విధేయులై సక్రమ ప్రవర్తన మూలంగానే గాక ప్రత్యేక పోలీసులుగా పని చెయ్యడానికి స్వచ్ఛందంగా వచ్చి ప్రభుత్వంతో సహకరించాలని విజ్ఞప్తి చేస్తున్నాను. శాంతి భద్రతలు కాపాడడానికి ఎవరేవిధంగా సహాయంచేయ నిశ్చయించుకున్నా స్వీకరించడానికి ప్రభుత్వం సిద్ధంగా ఉన్నది. దుఃఖార్తులైన వారు వెంటనే తమతమ వివరాలను చీఫ్ కమీషనర్ పేరగాని దేశీయశాఖా కార్యదర్శి పేరగాని వ్రాయవలసిందని కోరుతున్నాను. ఇదివరలో ఉద్యోగాలనుండి విముక్తి పొందిన వారు ముఖ్యంగా ముందుకువచ్చి ఇట్టి అత్యవసర సమయంలో సహాయం చేస్తారని ఆశిస్తున్నాను. మోటారు సైకిళ్ళు మొదలైన సత్వర వాహనాలుగలవారు కల్లోలిత ప్రాంతాల పర్యవేక్షణకూ, వేగంగా వార్తలు చేర్చవలసిన తదితర కార్యాలకూ ఉపయోగపడేందుకు ముందుకు రావలసిందని అర్థిస్తున్నాను."

## ఢిల్లీకి గాంధీజీ రాక

### పటేల్ ప్రభృతుల స్వాగతం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 9:

నేటి ఉదయం ఏడు గంటలకు మహాత్మా గాంధీ సురక్షితంగా ఢిల్లీ చేరుకున్నారు.

ఆయనా ఆయన అనుచరులూ ఢిల్లీకి పదిమైళ్ళ దూరంలో ఉన్న షద్రా స్టేషనులో రైలునుంచి దిగిపోయారు. ఉప ప్రధాని సర్దార్ వల్లభాయిపటేలు, ఆరోగ్య మంత్రి రాజకుమారీ అమృతకౌర్‌గార్లు వారికక్కడ స్వాగత మిచ్చారు. అక్కడనుండి గాంధీ బృందం బిర్లా భవనానికి వెళ్ళింది.

గాంధిజీ ఢిల్లీకి చేరుకోవడంలోనే భారత ప్రధాని పండిట్ జవహరలాల్ నెహ్రూ వారిని దర్శించారు. ఆయనవెంట విద్యామంత్రి మౌలానా అబుల్‌కలాం ఆజాద్‌గారు కూడా ఉన్నారు.

## చైనాలో విదేశీయులు

షాంగ్‌హాయ్, సెప్టెంబరు 8: చైనాలో సైనిక ప్రాంతాలలో ఉన్న విదేశీయులంతా తక్షణం ఆ ప్రాంతాలనుండి వెళ్ళిపోవాలని చైనా రక్షణమంత్రి కార్యాలయం ఈ రాత్రి ప్రకటించినది. అయితే ఇది చైనా ప్రభుత్వం కింద ఉద్యోగం చేస్తున్నవారికీ, రక్షణశాఖ అనుమతులు ఉన్నవారికీ అన్వయించదు.

## "పంజాబులో శాంతిస్థాపనకై మా సర్వశక్తినీ వినియోగిస్తాం"

### నెహ్రూ, లియాకత్ ఆలీల హెచ్చరిక

న్యూఢిల్లీ, సెప్టెంబరు 7: పంజాబ్ కల్లోలాలను తిరిగి తలయెత్తకుండా అణచడానికి ఉభయ ప్రభుత్వాలూ అతి కఠినచర్యలు తీసుకోగలవని హెచ్చరిస్తూ ఇండియా పాకిస్థాన్ ప్రధానమంత్రులిరువురూ నేటి సాయంకాలం ఒక సంయుక్తప్రకటన చేశారు. ఈ ప్రకటనకు గురుముఖిలోనూ, ఉర్దూలోనూ ఒకలక్షకు పైగా ప్రతులుతీసి విమానాలద్వారా కల్లోలిత ప్రాంతాల్లో వడవేయించారు.

"చట్టవిరుద్ధంగా ప్రవర్తించేవారిని శిక్షించడానికి ప్రభుత్వ శక్తినంతటినీ ఉపయోగిస్తాము. ముఖ్యంగా ఆయుధాలు గల మురాలను స్వాధీనంచేసుకొని శిబిరాలలో నిర్బంధించివేస్తాము. నేరాలు చేస్తుండగా కనపడినవారిని వెంటనే కాల్పించివేస్తాము. ఈ విషయాల్లో ఆయా ఆజ్ఞలను ఉద్యోగులు సరిగా నిర్వర్తించేటట్లు ఉభయప్రభుత్వాలూ శ్రద్ధవహిస్తాయి." అని ఉభయప్రధానులూ తమ ప్రకటనలో నిస్సందేహంగా ఉద్ఘాటించారు.

ఆతర్వాత సత్వరశాంతి స్థాపనకై ప్రజాసహకారాన్ని అర్థిస్తూ విజ్ఞాపనచేసి కాందిశీకుల విషయమై ఇల్లా అన్నారు.

"కాందిశీకులను రక్షించడానికి సత్వరచర్యలు తీసుకోవాలని ఉభయప్రభుత్వాలూ నిశ్చయించాయి. కాందిశీకులకునిశ్వసంగల సైనికదళాలు ఆ యా రక్షణశిబిరాలను సంరక్షించడానికి నియమింపబడతాయి. సైనిక బందోబస్తు విషయంలో కూడా ఇదేవిధానం అనుసరింపబడుతుంది.

కాందిశీకులకు ఆహారాది అవసర పదార్థాలు సప్లయి చేసే బాధ్యతనుగూడా ఉభయప్రభుత్వాలూ స్వీకరించాయి. కాందిశీక కమీషనరులను నియమించడమయింది. వీరికోసమై ఒక్కొక్క ప్రభుత్వమూ ప్రత్యేక సంస్థలను త్వరలోనే నెలకొల్పుతుంది.

బలవంతంగా స్వాధీనం చేసుకున్న ఆస్తులను గుర్తించరాదని ఉభయ ప్రభుత్వాలూ నిశ్చయించాయి. స్వదేశం విడిచి వెళ్ళిపోయిన కాందిశీకుల ఆస్తులనురక్షించి తిరిగి వానిని స్వంతదారులకప్పగించే బాధ్యతను ఉభయప్రభుత్వాలూ స్వీకరించాయి. ఇందుకోసమై కాందిశీకుల ఆస్తిసంరక్షకాధికార్లను నియమిస్తున్నాము.

ఇప్పటి కల్లోలాలవల్ల ప్రాక్పశ్చిమపంజాబ్ రాష్ట్రాలు రెంటికీ అపారనష్టం కలిగింది. అనేకవేలమంది ప్రాణాలుపోయాయి. నిన్న మొన్నటివరకూ ప్రశాంతంగా ఉన్న పంజాబు నేడు నరకకూపంలా ఉన్నది. మనుష్యులు పశువులకంటే హీనమయ్యారు. స్త్రీ బాల వృద్ధులే అయినా కనికరించకుండా గాతకులవలె తమదగ్గరున్న పాపులవారిని నిలువునా ప్రాణాలుతీశారు. ఇళ్ళు తగలబెట్టారు; ఆస్తులందోచుకున్నారు. భయంతో పారిపోతున్న వారిని కూడా నిర్దాక్షిణ్యంగా నరికివేశారు.

ఇటువంటి చర్యలవల్ల ఎవరికీ ఏమీ లాభంలేదు. హిందువులు, సిక్కులు, ముస్లింలు అందరూ తమ ధనప్రాణాలకు అపాయం తెచ్చుకొన్నారు. ఈ పరిస్థితిలో అశాంతి నెంతమాత్రమూ సహించరాదని, ఉభయ డొమినియన్ ప్రభుత్వాలూ, ప్రాక్పశ్చిమ పంజాబ్ ప్రభుత్వాలూ దృఢనిశ్చయమయ్యాయి. దీని కనుగుణంగానే ఆయా వర్గాల నాయకులు తమ తమ పక్షీయులను ప్రశాంతంగా ఉండవలసిందని ఉద్బోధించారు. ప్రజలందరూ సురక్షితంగా ఉండగలిగేందుకు శాంతి భద్రతలను కాపాడాలని వారుగూడా నిశ్చయించుకున్నట్లు ప్రకటించారు.

## బ్రిటన్ - ఫ్రాన్సు 50 ఏళ్ల ఒడంబడిక

### బ్రిటిష్ విదేశశాఖ ఆమోదం

లండన్, సెప్టెంబరు 8: మార్చి 4-వ తేదీన డంకర్కులో బ్రిటిషు విదేశమంత్రి ఎర్నెస్టు బెవిన్, ఫ్రాన్సు విదేశమంత్రి జార్జి బిడా ఉభయులూ సంతకాలు పెట్టిన 50 ఏళ్ల ఒడంబడికను బ్రిటిషు విదేశశాఖ ధాయపరిచింది. ఉత్తరోత్తరా జర్మనులు ఎట్టి దురాక్రమణనూ జరపకుండా నిరోధించడానికి చేసుకున్న ఒడంబడిక ఇది.

## ఢిల్లీలో ఘోర సంక్షోభం

### రైళ్ళు, విమానాలు, ఇతరవాహనాలు ఎక్కడివక్కడ స్తంభించినవి

న్యూఢిల్లీ, సెప్టెంబరు 8: కొంతమంది సిక్కులు ముస్లిములను కొట్టినటుగా తెలుస్తూంది. అని ఢిల్లీ జిల్లా మేజస్ట్రేటు ఈరోజు రాత్రి ప్రకటించినారు. ఈ కారణమువల్ల సిక్కులు ఎవ న్నూ తొమ్మిది అంగుళాలకన్నా ఎక్కువ పొడుగు ఉండని కృపాణములను సిక్కులు వెంట ఉంచుకొనరాదని ఉత్తరవులు చేసినారు. అయితే ముస్లిములు తిరిగి సిక్కులను కొట్టినట్లయితే సిక్కులను పెద్ద కృపాణములు ఉంచుకోరాదని చేసిన నిషేధపు ఉత్తరవును రద్దు చేయడము అవుతుందనీ, ఈ విషయము ముస్లిములు గుర్తు ఉంచుకోవలెననిన్నీ జిల్లా మేజస్ట్రేటు తెలియచేసినారు.

న్యూఢిల్లీలో కొట్లాటలు, ఇండ్లు తగలపెట్టడమూ, దోపిడీలు చేయడమూల్లు ఈరోజు ఉదయము పది గంటలు మొదలు రేపు ఉదయము పది గంటలవరకున్నూ కర్ఫ్యూ ను అమలుజరచినారు.

సబ్జిమండి ప్రాంతములో ఒక ఇంట్లో నుంచి దారిన పోయేవారిమీద తుపాకులు కాల్చడము మొదలు పెట్టినారు. అంతట పోలీసువారున్నూ మిలటరీవారున్నూ ఆ యింటికి గురిపెట్టి చాలాసేపు తుపాకులు కాల్చినారు. తరువాత చీఫ్ కమీషనరున్నూ డిప్యూటీ కమీషనరున్నూ ఆ ప్రదేశానికి వెళ్ళిచూచినారు.

చాందినీ చౌకులో కూడా కాల్పులు జరిగినవి. చెదురుమదురుగా దాడులతో పొడవడమున్నూ దుకాణాలను దోచివేయడమున్నూ నగరములో వివిధ భాగాలలోనూ సాగినవి. ఉదయము దుండగుల మూక ఒకటి బయలుదేరివచ్చి యూనివర్సిటీ కార్యాలయాన్ని దోచివేసినారు. ఢిల్లీ యూనివర్సిటీలో ఒక విద్యార్థినిని సురక్షిత ప్రదేశానికి పోలీసు కాపలాతో చేర్చినారు.

నిన్నటిదినము (సెప్టెంబరు 7) "కన్నాట్ సర్కస్"లో కొట్లాటలు జరిగినతరువాత ఆ ప్రాంతము ప్రశాంతముగానుంది. ఈ రోజు పహార్‌గంజ్‌లో తీవ్రమయిన

4 వ పేజీ చూడుడు

## ఒరిస్సా సరిహద్దులు

### 6 గురు శాసనసభ్యులతో ప్రత్యేక సంఘస్థాపన

కటకం, సెప్టెంబరు 8: నూతన రాష్ట్రనిర్మాణ సందర్భంలో సరిహద్దు నిర్ణయ సంఘాన్ని నియమిస్తే, దాని ఎదుట ఒరిస్సావాదాన్ని సమర్థించడానికి ఒరిస్సా కాంగ్రెసు శాసనసభాపక్షం, 6 గురు సభ్యులతో ఒకసంఘాన్ని నియమించింది. వాదానికి అవసరమైన విషయసేకరణకు ఈ సంఘసభ్యులు ప్రభుత్వ సహాయం తీసుకుంటారు. దీనికి దీనబంధు సాహును సమావేశకర్తగా నియమించారు.

## ఢిల్లీలో పోలీసు మిలిటరీ సంయుక్త కేంద్రస్థానం ఏర్పాటు

### ప్రభుత్వ అత్యవసరసంఘ నిర్ణయాలు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 8: భారత ప్రభుత్వ అత్యవసరసంఘం నేటి ఉదయం సమావేశమయి (ఈ సంఘం ప్రతిరోజూ సమావేశమవుతుంది) రోడ్లు, రైళ్లు విమానాలు మొదలైన ప్రయాణ సౌకర్యాలన్నిటినీ సమీకరించి వాటిలో అధిక భాగం కాందిశీకుల చేరవేతకై వినియుక్త మయ్యేటట్లు చూచేందుకుగాను ప్రయాణ సౌకర్య సంచాలక సంఘాన్ని స్థాపించాలని నిశ్చయించినట్లు నేడు వెలువడిన పత్రికా ప్రకటన తెలుపుతోంది.

స్వచ్ఛంద సేవకులతో అదనపు పోలీసు దళాలను నిర్మించి ఢిల్లీలో శాంతిస్థాపనకై స్వచ్ఛంద పర్యవేక్షక మోటారుసైకిలు వగైరాలు ఉపయోగించవలెననీ, ప్రభుత్వ ముఖ్యోద్యోగులందరికీ ప్రత్యేక ప్రయాణసౌకర్యాలు కల్పించవలెననీ ఈ సంఘం దేశీయమంత్రాంగానికి సూచించింది.

సంయుక్త పోలీసు మిలిటరీ కేంద్రస్థానం ఢిల్లీలో నెలకొల్పి శాంతిభద్రతల సంరక్షణకు సమష్టిగా కృషిచెయ్యాలని ఈ సమావేశంలో నిర్ణయమైంది.

దేశంలో వివిధప్రాంతాల పరిస్థితిని గూర్చి భారతసైన్య కేంద్రస్థానం ఈ సంఘానికి సమర్పించిన నివేదికలో ఈ క్రింది ముఖ్యాంశాలు ఉన్నాయి. వేరు విధంగా చెప్పినప్పుడు తప్ప మిగిలినప్పుడల్లా ఆయా పరిస్థితి 7 వ తేదీ సాయంత్రం గం 4 నుండి 8 వ తేదీ ఉదయం గం 6 వరకూ కర్తవ్యంగా ఉన్నాయని గ్రహించాలి.

(2-వ పేజి చూడుడు)

## "పాలస్తీనాలో ఎక్కడా యూదు ప్రభుత్వాన్ని ఏర్పడనివ్వం"

### సమితి నివేదిక అన్యాయంగా వున్నదని అరబ్బుల ఖండన

లేక్‌సక్సెస్, సెప్టెంబరు 8: "ఐక్య రాజ్య సమితి విచారణ సంఘం పాలస్తీనావిషయమై తయారుచేసిన నివేదిక చాల అసందర్భంగానూ, అన్యాయంగానూ, అనాచరణీయంగానూ ఉన్నది. అరబ్బులెవ్వరూ ఈ నివేదికను అంగీకరించరు," అని అరబ్ ఉన్నత కార్యవర్గం ఈ వేళ రాత్రి ప్రకటించింది.

"ఈ విచారణ జరిపిన విధమూ, విచారణ సంఘంలోని చాలమంది సభ్యులు యూదు పక్షంతో పూర్తిగా ఏకీభవిస్తూ బహిరంగంగా చేసిన ప్రసంగాలూ, విచారణ సంఘంలో అధిక సంఖ్యాకులు పక్షపాతంతో వ్యవహరించారనీ అరబ్బులకు విశదం చేసినవి. మరి కొందరు సభ్యులను యూదు వాదాన్ని సమర్థించమని వారి ప్రభుత్వాలు ఆజ్ఞాపించినవి. మరి కొందరు సభ్యులకు యూదులతో వ్యక్తిగత స్నేహ సంబంధాలు వున్నవి.

అసలు సమస్య లోతుపాతులు తెలుసుకోకుండా కేవలం పక్షపాత బుద్ధితో ఈ విచారణ సంఘం తన నివేదికను తయారుచేసి ఐక్యరాజ్య సమితి సూత్రాలకే విరుద్ధంగా ప్రవర్తించింది.

తమ బలాన్ని అధికం చేసుకునేందుకు వివిధ దేశాలూ కలిసి పన్నుతున్న పన్నాగాలకూ, రహస్య ఒడంబడికలకూ, అన్నీ కలిసి అంగ్లోమయంగా తీసుకువచ్చే ఒత్తిడికి అరబ్బులు లేశమాత్రమూ సహించరు. పాలస్తీనా భూభాగంలో ఒక్క అంగుళం మేరలోనైనా, యూదు ప్రభుత్వాన్ని వారు స్థాపించనీయరు.

అరబ్బుల ఏకైక ఆశయం 'పాలస్తీనాలో స్వతంత్ర అరబ్ ప్రజా స్వామ్యాన్ని నిర్మించటమే. ఆ ఒక్క దానికే మేము అంగీకరిస్తాము. దీనికి వ్యతిరేకంగా ఏది చేయాలని ప్రయత్నించినప్పటికీ రక్తపాతం తప్పదు. ఇదే మూడో ప్రపంచ యుద్ధానికి కూడా దారి తీస్తుంది."

జెరూసలేం, సెప్టెంబర్ 8: "బ్రిటిషువారి అనుమతి లేకుండానే యూదులు పాలస్తీనాకు వలస పోవటమనేది, వ్యతిరేకంగా జెనివ్. ఎన్ని పన్నాగాలు పన్నినప్పటికీ నిరాఘాటంగా సాగిస్తాము." అని యూదు ఏజన్సీ రాజకీయ శాఖాధికారి గోల్డా మెయెర్‌సన్, సతి, ఈ వేళ రాత్రి టెల్ అవీవ్‌లో జరిగిన యూదు సభలో ప్రకటించింది.


అన్ని దళములలోను, సైజులలోను ఇత్తడి, రాగి షీట్లు, స్ట్రిపులు, సర్కిల్సు, సరసమైన ధరలకు దొరకును. మీ రెక్కడైనా కొనేముందు మాపద్ద విచారించండి.

| | |
|---|---|
| ఇంకను:— పి. ఎస్. ఎస్. ఎస్. అంబలవణ చెట్టియార్, పోస్టు, మట్టంచేరి, కొచ్చిన్. | పి. ఎస్. ఎస్. ఎస్. అంబలవణ చెట్టియార్ అండ్ కో., లిమిటెడ్., 310/311, తంబుచెట్టివీధి, జి. టి. మద్రాసు. (ప్రకాశము ఎత్రబాలుగాట్టిక్షకుండా) |

జీవిత లేక ఆస్తుల రక్షణకు మా సలహా తీసుకొనుడు.
ది జనరల్ అష్యూరెన్సు సొసైటి లిమిటెడ్



మంచి ఆరోగ్యం పొందుము

అత్యంత ఆరోగ్య నియమముల క్రింద, మేలురకము పొగాకునుండి ప్యాకింగుజో సిగరెట్లు తయారుచేయబడినవి. అవి అలసటను పోగొట్టి నరములకు నుత్సాహ మిచ్చు టానిక్కుగా పనిచేయును

**PASSING SHOW**




10 సిగరెట్లు 3 అణాలు

PSC/99



పది నిమిషములు మాత్రం




సారిడాన్

విఖ్యాతమైన బాధ నివారకం





పాండియన్ ఇన్స్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్.

(ఇండియాలో స్థాపితం: 1933)

హెడ్ ఆఫీసు: మధుర.

ఉన్నత సేవచేయుచున్నది.

అగ్ని, మోటారు, ప్రమాదములు

మొదలగు భీమాలను నిర్వహించును.

మొత్తము ఆస్తులు రూ 62,00,000

బ్రాంచీలు: బొంబాయి, అహమదాబాదు, కలకత్తా, రావల్పిండి.

చీఫ్ ఏజంట్లు: ఏ. అండ్ ఎఫ్. హార్వే లిమిటెడ్, మధుర.

కె. యం. ఎస్. లక్ష్మణ అయ్యరు అండ్ సన్సు,

మధుర, తిండివనం, మద్రాసు, సాలె, బెజవాడ, కాకినాడ, విజయనగరము.


## ఢిల్లీ సంక్షోభం

(1 వ పేజీ తరువాయి)

కల్లోలము చెలరేగింది. ఈ పహార్‌గంజ్ న్యూఢిల్లీ రైలుస్టేషనుకు సమీపములో ఉన్న కరోల్ బాగు అనే ప్రదేశములో ఉంది ఇది ఢిల్లీ మున్సిపాలిటీ సరిహద్దులమీద టర్కుమాన్ ద్వారమును అనుకొని ఉంది. ఇక్కడ దోపిడిచేసి ఇండ్లు తగలబెట్టడము జరిగింది. పోలీసులమీద పోలీసులు తుపాకులు కాల్చినారు. అనేక సందర్భాలలో దుండగులు బాంబులు వేసినారు. ఎంత మందికి ప్రమాదము అయిందిన్నీ అంకెలు ఇంకా తెలియలేదు.

సంక్షోభము చెలరేగిన అన్ని ప్రదేశాల లోనూ మిలటరివారున్నూ పోలీసువారున్నూ బాగా గస్తీ తిరుగుతూ ఉన్నారు.

ఈ ఉదయము పదిగంటలకు కర్ఫ్యూ తీసిపోగానే కరోల్‌బాగులో తుపాకుల మోతలు వినిపించినవి. దుండగులు ఇండ్ల మీదచేరి రస్తాలమీదఉన్న పోలీసులమీదనూ మిలటరివారిమీదనూ తుపాకులు కాల్చడము మొదలుపెట్టినారు. అనేక బాంబులు ప్రేలినవి. రెండుగంటలసేపు ఎడతెరిపి లేకుండా తుపాకులు కాల్చడము జరిగింది. మిలటరివారు ఆయావీధులను సందులను ఆక్రమించుకొని తుపాకులు కాల్చడము ఆరంభించినారు. మధ్యాహ్నము అయ్యేసరికి దుండగుల మూకలు ఒక మసీదు దగ్గరి పారిపోవడము సంభవించింది. అప్పుడు అక్కడనుంచి వారు పారిపోకుండా చాలామందిని పట్టుకొన్నారు.

సుప్రసిద్ధ వైద్యుడు డా॥ యన్. పి. జోషీ అనే ఆయన ఇంటిఎదుట కరోల్ బాగులో దుండగులమూకలు గుమికూడి తుపాకులు కాల్చి ఆయనను చంపివేసినారు. ఆ ప్రాంతములో చాలాఇండ్లను దోచివేసి తగలపెట్టడమున్నూ చేసినారు.

ఈ పహార్‌గంజ్ ప్రాంతముఅంతా ఇప్పుడు పోలీసులున్నూ మిలటరివారున్నూ ఆక్రమించుకొన్నారు.

ఈ సంక్షోభము అయిన అన్ని ప్రదేశాలలో ప్రమాదాలు ఎక్కువగానే అయినవి. కాని ఎంతమంది చనిపోయిందిన్నీ ఎంతమందిగాయపడ్డదిన్నీ అంకెలు తెలియడములేదు. పాతఢిల్లీలో చాందినిచౌకు ప్రాంతములో యీ రోజు ఉదయము పన్నెండు శవాలు కనిపించినవి. తెల్లవారుఝామున జరిగిన కొట్లాటలలో వీరు చనిపోయి ఉంటారు. నగరము అంతా కూడా సంక్షోభావస్థలో ఉంది.

ఢిల్లీ బొంబాయి నగరాలమధ్య జరిగే విమానసంచారము రద్దుచేసినారు.

జి. ఐ. పి. రైలుబండ్లున్నూ బి. బి. సి. ఐ. రైలుబండ్లునూ, ఢిల్లీకి పోవడనిన్నీ మథురావరకే పోవతవని ఆ రైల్వేలవారు ప్రకటించినారు.

పోలీసు కాపలాతో ఉభయవర్గాలకు చెందిన వందలాది స్త్రీలనూ పురుషులనూ శిశువులనూ సంక్షుభిత ప్రదేశాలనుంచి సురక్షిత ప్రదేశాలకు చేరుస్తున్నారు. న్యూఢిల్లీలోనూ పాత ఢిల్లీలోనూ దుకాణాలన్నీ కట్టివేసినారు. రేషనుకానీ ఇంకా యితర పదార్థాలుకానీ దొరకేసదుపాయము లేదు. ఈ రోజున ఢిల్లీనుంచి రైలుబండ్లు బయలుదేరవని ప్రకటించినారు. ఢిల్లీకివచ్చే రైలుబండ్లు ఏవి ఎప్పుడు వస్తవో తెలియదు. స్టేషన్ ప్లాట్‌ఫారముమీదనిలచిన రైలుబండ్లలో ప్రయాణీకులను దుండగులు కొట్టినారు. చాలామంది చనిపోయినారు.

ఢిల్లీనుంచి విమాన ప్రయాణము ఆగిపోయింది.

రేపటిదినమునుంచి ఢిల్లీటవున్‌హాలులో పంజాబ్ కార్యస్థానము ఏర్పడుతుంది. మిలటరి ఏర్పాట్లు పోలీసు ఏర్పాట్లు సంక్షోభానికి సంబంధించిన యావత్తు ఏర్పాట్లు రేపటినుంచి ఈకార్యాలయమువారు నిర్వహిస్తారు.

లోగడ ఇటలీలో ఇండియాదండును నిర్వహించిన మేజర్ జనరల్ దడ్లి రస్సెల్ తూర్పుపంజాబు సేనలను నిర్వహిస్తాడు. బ్రిగేడియర్ తిమ్మయ్య మేజర్ జనరల్‌గా తూర్పుపంజాబులో వ్యవహరిస్తాడు.

ఢిల్లీలో ఇప్పుడు ఏర్పాటు చేసినఅత్యవసరదండుకు ప్రధానాధికారిగా మేజర్ జనరల్ టి. డబ్లియు. రీస్ వ్యవహరిస్తాడు. మిలటరి ఢిల్లీకి విచ్చిగావస్తూ ఉంది. రాత్రికి మద్రాసు దండు చేరుతుంది. గుర్ఖాలదండు ఎల్లుండి చేరుతుంది. గవర్నరుజనరల్ తన బాడీగార్డుకు చెందిన దండును అంతా ఢిల్లీ కాపలాకు నియమించినాడు. సేనాధిపతి సర్‌రాబ్‌లాక్‌హార్ట్ ఢిల్లీ సంక్షుభిత ప్రదేశాలను అన్నిటినీ తిరిగి చూచినాడు.

పాతఢిల్లీలో పండిత జవాహర్‌లాల్ నెహ్రూ ఇద్దరు ఆడపిల్లలను సంక్షోభప్రదేశములో కాపాడినాడు.

## మిలిటరీ కేంద్రం

(1-వ పేజీ తరువాయి)

తూర్పు పంజాబ్ చాలామటుకు మిక్కిలి ప్రశాంతంగా ఉన్నది. కాంది శీకుల తరలింపు సవ్యంగా సాగుతోంది. పెద్ద సంఘర్షణ ఏదీ జరగలేదు.

కాంగ్రా, గురుదాస్‌పూరు జిల్లాలలో గడచిన రెండు రోజులుగా ఎటువంటి సంఘటనా జరగలేదు. అమృతసర్ సరి

## ఈజిప్ట్-బ్రిటన్ దేశాల వివాదం

### చైనాప్రతినిధుల రాజీయత్నం

లేక్‌సక్సెస్, సెప్టెంబరు 8: ఈజిప్టు, బ్రిటనుల వివాదంలో ఒక రాజీని కుదిర్చేందుకు భద్రతాసంఘంలోని చైనా ప్రతినిధివర్గం రేపు ప్రయత్నించబోతున్నది. ఈజిప్టులోని బ్రిటిషు సైన్యాలను వెంటనే తొలగించాలనే హక్కు ఈజిప్టుకు ఉన్నదని భద్రతాసంఘంచేత వీరు అంగీకరింపజేస్తున్నారు.

ఈజిప్టునుండి బ్రిటిషుసైన్యాల ఉపసంహరణ అనే విషయం ఆంగ్లో-ఈజిప్షన్ ఒడంబడికవల్ల నిర్ణయమైనది, ఇంక సూడాన్ సమస్య మాత్రమే ఉన్నదని బ్రిటిషు ప్రతినిధులు అంటున్నారు. కాబట్టి ఇరుపక్షాలూ తిరిగీ సంప్రదింపులు ప్రారంభించాలని భద్రతాసంఘం సూచిస్తే సరిపోవచ్చును.

## కొరియా విభజన?

### అమెరికా ఆలోచన

వాషింగ్టన్, సెప్టెంబర్ 8: కొరియా భవిష్యత్తును నిర్ణయించేందుకు ఈవేళ జరగవలసిన 4 అగ్రరాజ్యాల సమావేశం, రష్యా అంగీకరించనందున 'వాయిదా' పడింది. రష్యా సమాధాన వివరాలింకా ప్రకటనకాలేదు. ఇంక కొరియా విషయాన్ని ఐక్యరాజ్య సమితికి నివేదించటమూ లేక ఉత్తర కొరియాను రష్యాకు వదిలి దక్షిణ కొరియా (అమెరికా ఆక్రమిత ప్రాంతం) తాత్కాలిక కొరియన్ ప్రభుత్వాన్ని నెలకొల్పటమూ అని అమెరికా ఆలోచిస్తున్నది.

## జావా, సుమత్రాలలో డచ్చికుతంత్రం?

హేగ్, సెప్టెంబర్ 8: "ఈమధ్య తిరిగీ ప్రారంభమైన యుద్ధంలో జావా సుమత్రాలలో తాము ఆక్రమించుకున్న ప్రాంతాల్లో తాత్కాలిక ప్రభుత్వాలను కొద్దికాలంలో డచ్చివారు ఏర్పరుస్తారు" అని కాథ్లిక్‌పత్రిక 'ట్రా' ఈవేళ ప్రకటించింది. సెప్టెంబర్ 16 వ తేదీన డచ్చి పార్లమెంటును ప్రారంభిస్తూ విల్హెల్మినా రాణి ఈ విషయాన్ని ప్రకటిస్తుంది.

## పెద్దఎత్తున డచ్చిదాడి

బటేవియా, సెప్టెంబర్ 8: శుక్రవారంనాడు సెమరాంగ్‌కు 20 మైళ్ల దూరంలో డెమక్ ప్రాంతంలో డచ్చివారు పెద్ద ఎత్తున దాడిని జరిపినట్లు జోగ్జకర్తానుంచి ఈవేళ వచ్చిన వార్తలు ప్రకటించినవి. ఈ దాడిలో 6 యుద్ధ విమానాలుకూడా పాల్గొన్నవి. మధ్యజావాలో డచ్చిసేనలు రిపబ్లికన్ల భీషణ ప్రతిఘటనను ఎదుర్కొని పుర్వారింగ్‌ను ఆక్రమించుకోగలిగినవి.

### ఇండియన్ రెడ్‌క్రాస్‌సంఘం

...రిపబ్లికన్లకు ఔషధాలు ఎంతవరకు వున్నవి అనే విషయాన్నిగురించి ఇండియన్ రెడ్‌క్రాస్‌సంఘం తన పరిశీలను ముగించింది. సంఘనాయకుడు డా॥ నిరులా వెంటనే సంఘంలోని మిగ్గురు ఇండియన్ డాక్టర్లనూ ఇండియాకు చేర్చే ప్రయత్నాలు చేయుమని సింగపూర్‌లోని రెడ్‌క్రాస్‌సంఘంవారికి రేడియోలో తెలియజేశాడు.

హద్దులో ఒకటి రెండు స్వల్ప సంఘర్షణలు జరిగాయి. సైన్యాలు కాల్పులు సాగించగా నలుగురు చనిపోయారు. కిసన్, కోటక్, హాంజీ ప్రాంతాలు ప్రశాంతంగా ఉన్నాయి కాని భివానీలోనూ, నీమ్లాలోనూ ప్రజలు భయోత్పాతంతో ఉంటున్నారు. 5 వ తేదీన సిర్‌హింద్‌వద్ద ఒకరైలు ముట్టడింపబడింది. ఇద్దరు ప్రయాణీకులు గాయపడ్డారు. రైలుతోనుండే మిలిటరీవారు కాల్పులు చెయ్యగా అయిగురు మరణించారు. 8 గురు గాయపడ్డారు.

గుర్గావ్ పరిస్థితి మళ్లీ ఆదుర్దా కలిగిస్తోంది. అక్కడ మళ్లీ జనసమూహోద్రేకం పొంగుతున్నట్లు వార్తలు వస్తున్నాయి. కాపలా ఉన్న మిలిటరీదళాలు చాలా మూకలమీద కాల్పులు సాగించవలసివచ్చింది.

8 వ తేదీ ఉదయానికి ఢిల్లీ పరిస్థితి అదుపులో ఉన్నట్లు తెలియవచ్చింది. రాత్రి సంచలనం ఏమీలేదు. కాని సోమవారంఉదయం దార్యాగంజ్ ప్రాంతంలో గృహదహనాలు జరిగాయి. కన్నాట్ పాలెస్‌వద్ద దుకాణాల లూటీ జరిగింది. దుర్మార్గుల చర్యలను అరికట్టడానికి జదన్, గలీవద్ద మిలిటరీ కాల్పులు జరిగాయి. సంక్షోభకారకులు నలుగురు గాయపడ్డారు. 25 గురు అరెస్టు అయ్యారు. దారీబాల్సా గలీవద్ద దుర్మార్గులు ఇళ్ళపైనుండి వీధిలో జనంమీదికి తుపాకులు కాల్చారు. అక్కడ చాలా అరెస్టులు జరిగాయి. నజాఫ్‌గర్ ప్రాంతంలో పరిస్థితి అదుపులోకి వచ్చింది.

## మదరాసు ధరలు

మదరాసు, సెప్టెంబరు 9:

వేరుసెనగ: (531 పౌ 1-కి ఎక్స్‌పోర్టు గిడ్డంగులు) మెషిన్ (సేల్సుటాక్సుతో సహా) పప్పు బజారు 142-0-0.

ఇంగ్లీషుకాండి (500 పౌనుల గలది) 1-కి ఆఫీసు వ్యాపారంలేదు.

వేరుసెనగనూనె: ఎక్సుపెల్లర్ (సేల్సుటాక్సుతో సహా)

మదరాసు, బజారు వెల 805, 810.

ఆముదం మిల్ డెలివరి ఎక్సుపెల్లర్ పర్ ఇంగ్లీషుకాండి 500 పౌనులు గలది రు. 840.

కొంకాయనూనె (38 పౌను గల డబ్బా. వెల 29-8-0)

పంచదార

2 అందరు "హాస్‌పేట" రూ. 65-13-2

బంగారు-వెండి: సేటి మధ్యాహ్నం

1 గంటకు పవరను 1-కి ఎడ్వర్డు బొమ్మ వెల 74-8-0 పెట్లాబంగారు తులం 110-12-0 మూస బంగారు 109-8-0. సీమ వెండి తులం 100-కి (రెడీ) 169-12-0 తులం వెండి 1-కి 1-12-0.

## మద్రాసులోహపుమార్కెటు

ఇనుము కమ్మిచీలలు 1"×15 జి. 0-6-7; $1\frac{1}{4}$"×16 జి. 0-7-0; $1\frac{1}{2}$"×13 జి లేక 14 జి. 0-5-1; 2"×10 జి. లేక 12 జి. 0-4-11; 3" నుండి 6" పౌను 1 కి 0-4-6. ఇనుముకొయ్య మరచీలలు షిలింగు 1 కి 0-14-0 నుంచి 2 రూ. తలాయిల యిత్తడిమూతలు $\frac{1}{2}$" రూ 2-0-0, $\frac{3}{4}$" రూ 2-8-0 నుండి రూ 3-8-0. (ఒక్కమాతధర) యం. యస్. చదరపు పట్టెలు యిరుసుపట్టెలు హండ్రెడ్‌వెయిట్ 1 కి రూ 18-4-0 యం. యస్. రౌండు రేకులు హండ్రెడ్‌వెయిట్ 1 కి $\frac{1}{2}$ పైగా రూ 13-4-0 $\frac{1}{2}$" రూ 13-7-0 $\frac{3}{8}$" 14-8-0 $\frac{1}{4}$" రూ 17. గాల్వనైజ్డురేకులు హండ్రెడ్‌వెయిట్ 1కి 16 జి. రూ 17-8-0 24 జి. రూ 18-4-0 26 జి రూ 20-15-0 (2 అందరు) "హాసన్‌పూర్" 65-14-6 జేలింగ్ హుక్సు హండ్రెడ్‌వెయిట్ 1 కి $\frac{3}{4}$" రూ 48-4-0 $\frac{1}{4}$" రూ 50-12-0 మలామతీగలు హండ్రెడ్ వెయిట్ 1 కి రూ 27-8-0 నుండి రూ 46-4-0 ముళ్లతీగలు హండ్రెడ్‌వెయిట్ 1-కి 12 జి. 35-4-0 మారిస్‌గడియలు చీలలు పౌను 1కి $\frac{1}{4}$" 5/16" రూ 2-8-6 $\frac{3}{8}$" రూ 2, $\frac{1}{2}$" 0-14-0. ఆంగిల్సుప్లేట్సు:—హండ్రెడ్ వెయిట్ 1 కి రూ 12-12-0 నుండి రూ 13-12-0 బి. యస్. జాయింట్లు హండ్రెడ్ వెయిట్ 1 కి రూ 12-12-0.

## న్యూయార్కు దూది

న్యూయార్కు, సెప్టెంబరు 8: అక్టోబరు 31.00/31.01 డిశంబరు 30.70/30.72 జనవరి 30.65/ నా॥ మార్చి 30.62/30.62 మే 30.40/30.40 జూలై 29.70/29.70 అక్టోబరు 28.30/28.38 డిసంబరు 27.98/నా..

మిడ్లింగ్ హాజరు 31.75

అక్టోబరు (గరిష్ఠధర) 31.61

(కనిష్ఠధర) 31.00

### అక్టోబరు వాయిదా ధరలు

సేటి ప్రారంభం వెల 31.21

,, ముగింపు వెల 31.00


ప్రకటన

తిరువూరు గ్రామములో బెజవాడ - తిరువూరురోడ్డు ప్రక్కవున్న మా ఖాళీ స్థలములో సినిమాహాలు కట్టుకొనవచ్చును. వివరములకు:—శ్రీ వల్లంకి రాధా వెంకట కృష్ణారావు, తిరువూరు, కృష్ణాజిల్లా.



అశ్వశాస్త్రము

వెల రు. 3—0—0

గ్రంథకర్త:

డా॥ ఏజెళ్ల శ్రీరాములు చౌదరిగారు

రీసర్చి కెమిస్టు

అశ్వజాతులు, దశన్నపు - ఆక్షేపణ - నిరాక్షేపణ సుడులు - నడకలు, రోగ నిదాన చికిత్సలు-మసాలాలు-హల్వాలు-లేహ్యములు మున్నగు విషయములతో పది సంవత్సరముల నుంచి పరిశోధించి వ్రాసిన గ్రంథము. ఫోటోలతో సహా మంచి పేపరుతో ప్రకటించబడెను.

కోళ్ల పరిశ్రమ

వెల రు. 2—0—0

వివిధ జాతులకోళ్లు, పక్కల చరిత్రలు, రోగములు - చికిత్సలు ఫోటోలతో సహా మంచి పేపరుమీద ప్రకటింపబడెను.

వలయువారు:

సహదేవ పశువైద్య ఫార్మసి,

మారీసుపేట - తెనాలి.



మెపాక్రిన్ - బూట్స్ - మలేరియానుండి కాపాడు మీకు!

ఇంగాయకరమైన ఈ రిస్ల మలేరియా బారినుండి మిమ్మును రక్షించును. మీరు కష్టపడకుండ తీసుకొనవచ్చును. మరొకక్షణం లేక ఆరోగ్యం లేక ఇది సాధిస్తుంది.

15 బిళ్లలతో గూడిన సీసాలలో అన్ని ముఖ్యమందుల షాపులలో అమ్మబడును

బూట్స్ ప్యూర్ డ్రగ్ కంపెని (ఇండియా) లిమిటెడ్ వారిచే పంపిణీ

బూట్స్ ప్యూర్ డ్రగ్ కంపెని లిమిటెడ్, నాటింగ్‌హామ్, ఇంగ్లండ్ వారిచే తయారుచేయబడుచున్నది



ప్రతినూళ్ళు

5,00,000 కండెలు — గట్టిదనమునకు, నమ్మకమునకు మెక్కువ పరీక్ష — 80 నెంబరు వరకు.

చేయబడి మధుర మిల్సు నూళ్లు వాటి నాణ్యతవలన శ్రేష్ఠమైనవిగా రుజువుచేయబడినవి.

మధుర మిల్సు కంపెనీ లిమిటెడ్.

మిల్లులు

మధుర, ట్యూటికోరిన్, అంబాసముద్రము

మేము సప్లయి చేయునవి

నేత, అల్లిక ఫ్యాక్టరీలకు అన్నిరకముల గ్రే యారన్సు.

మేము నేత నేయము.

మా ప్రత్యేకతలు:

ఒంటినూలు - జంట నూళ్లు - చీజ్ యారన్సు

వడుగునూలు - కోన్‌యారన్ - కార్డుయారన్

కొండ్లుయారన్సు - వగైరా.

మేనేజర్సు:

మెసర్సు ఏ. అండ్ ఎఫ్. హార్వే లిమిటెడ్,

మధుర.

ప్రస్తుతము నూలు పంపకము కంట్రోలు చేయబడినది. నూలు అవసరములకు మీరాష్ట్రము లేదా సంస్థానములోని టెక్స్‌టైల్ కంట్రోలు అధికారులకు దరఖాస్తు పెట్టుకొనవలెను.



అదగ్గును అంత మొందింపుడు!

SANTÉ PASTILLES

తయారీదారులు:

RN 796 Tel.



సంపూర్ణంగా శుభ్రపరచును. ఆర్యన్ బ్రష్ సుమనోహరమైనది.

Aryan

ఆర్యన్ బ్రష్ కంపెనీ లిమిటెడ్, దాదరు బొంబాయి.



కుష్ఠు ★ బొల్లి

అన్నిరకముల కుష్ఠులకు, బొల్లి వ్యాధులకు, ఇతర చర్మవ్యాధులకు గ్యారంటీగా పనిచేయుచున్నవి

మా ఔషధరాజములే!!

క్రొత్తగా అచ్చు వేయబడిన మా తెలుగు పెద్ద కేటలాగులు, 10 భాషలలో ముద్రించియున్న కేటలాగులు, యోగ్యతాపత్రములు ఉచితము!

రెడ్డి & కో., (రిజిస్టర్డు) ★ H. O. గోపాలపురం (వయా) తణుకు, తూ. గోదావరిజిల్లా

బ్రాంచి ఆఫీసులు:

బెజవాడ ★ వాల్తేరు ★ కటక్ ★ సికిందరాబాద్

గాంధినగరం R. S. దక్షిణబజార్ 3560 కింగ్సువే

నెల్లూరు ★ ఫజిల్‌నగర్

కాపు వీ. గోరక్‌పూర్.

డాక్టర్లు ఎల్లప్పుడు వేర్కొనును
వింకోలా
సుబ్రమైన టానిక్
స్టాండర్డ్ ఫార్మస్యూటికల్ వర్క్సు లిమిటెడ్
కలకత్తా

ఉదర రోగ పీడితుడు చెప్పును

మెక్లీన్సును నేను ఎంతగా మెచ్చుకొందును

నీవు అజీర్ణముచేత బాధ పడుచుండి భోజనానంతరము నొప్పిని కలిగిగాని యితర బాధకర చిహ్నములనుగాని కలిగినయడల మెక్లీన బ్రాండ్ స్టమక్ పొడరును తీసుకొనుము. శీఘ్రగా అది బాధను తొలగించి జీర్ణశక్తిని చేకూర్చును.

అయ్యా,
"మెక్లీన"ను నేను ఎంతగా మెచ్చుకొందునో మీకు తెలుపుటకు వ్రాయుచున్నాను. నా ఉదరమందలి నొప్పులచేత సంవత్సరములుగా నేను విపరీతముగా బాధపడుచుండగా, దానిని పాడితిని,..... మెక్లీన్సు లేకుండినయడల నేనేమి చేయవలసియుండెనో నిజముగా నాకు తెలియదు.

మీ విశ్వాస పాత్రుడు. (సంతకము) డబ్ల్యు. ఏ. ఆర్.

మెక్లీను బ్రాండు స్టమక్ పొడరుయొక్క బహుళ వాడుకమే గుండెమంటను, ఆహార కోశములోని వాయువును, వమనములను, అజీర్ణమువల్ల కలిగిన ఉదర బాధలను త్వరగా తీసి వేయుటలోను, దానికి యున్న ప్రవీణతను చెప్పు సాక్ష్యము.

"ఎలెక్స్ సి. మక్లీన్" అను సంతకము చేయబడినయడల మాత్రమే మక్లీన్ బ్రాండ్ స్టమక్ పొడరు, బిళ్లలు నిజమైనవి

MACLEAN Brand Stomach Powder
Alex. C. Maclean

బిళ్లలుగా కూడా దొరకును

Copyright

ప్రపంచమంతటా ఎక్కువమంది ప్రజలు ఏ ఇతర రకాలకన్న అధికంగా గుడ్ ఇయర్ టైర్లమీదనే ప్రయాణం చేస్తారు
GOODYEAR
THE GREATEST NAME IN RUBBER

శిశువుల చర్మాన్ని చల్లగాను, పగలకుండాను వుంచుతుంది.
బిడ్డలకు కూటికూర టాల్కంపౌడర Cuticura Talcum Powder వాడండి-కోమలమైన చర్మానికి అదే మంచిది.
కూటికూర టాల్కం పౌడరు

# రాజకీయ మహాసభ

5-వ పేజీ తరువాయి

చెప్పకుండా కూడాడం శోచనీయమనిరి. ధాన్యసేకరణ లోటు ఫాక్టరీలు పెద్ద రయితుల దగ్గర ఉండికాని, చిన్న రైతుల దగ్గరలేవు. కనుక నిజపరిస్థితులను తెల్పు యీ తీర్మానాన్ని ఏకగ్రీవంగా అంగీకరించాలనిరి.

బొచిన సుబ్బారావుగారు, రేపను సాపలు మూనేస్తా పుంచే ప్రజలు గుంటూరు జిల్లాలో బహిరంగంగా ఎక్కడ నుండో తెచ్చుకుంటూ వున్నారనిరి. రయితులవద్ద మిగిలియున్న టులు అధికారులు లెక్కలకయారుచేస్తున్నారు. గాని అది నిజంకాదు. ప్రాక్యూర్మెంటు విధానం విఫలమయింది. పెర్మిటుపద్ధతి ప్రజలను ఏడిపించడానికి వచ్చింది. దీన్ని ఎత్తేయాలి. కంట్రోలు గ్రామసీమలందు ఎత్తివేయాలనీ, సరకు రవాణాకు అనకూలపరిస్థితు లేర్పరలచాని కోరిరి.

టి. ప్రకాశంపంతులుగారు: రాష్ట్రీ కాంగ్రెసు అధ్యక్షులు యిటువంటి ప్రకటన యిపుడు చేసేముందర రంగాగారు ప్రభుత్వానికి ఉత్తరం వ్రాయమనికోరుదు, తమపై నిందలు మోపుట కాధారమేమని అడగాలనిరి.

కంతేటి మునుస్వామి నాయుడుగారు తీర్మానాన్ని బలపరచుచు, రైతుశక్తి సత్తా తెలుసుకోకుండా ప్రభుత్వం వారు పనిచేస్తున్నారనియు, శిస్తువిధానం మార్చాలనియు, ప్రకాశంగారే ఆపని ఎందుకు చేయించలేదని ప్రశ్నించిరి. రయితుకి గిట్టుబాటయే ధర నిర్ణయించితే గాని తగినంత పండించలేదు. 19 రూపాయలకు చెల్లుతుంటే 18 రూ. రైతు ఎందుకమ్ముతాడు.

అధ్యక్షులు తీర్మానాన్ని ఓటుకు పెట్టగా ఏకగ్రీవంగా అంగీకరించబడింది.

## సోషలిస్టు ప్రజాస్వామ్యము

ఆగస్టు 15 స్వరాజ్య సంసిద్ధి దినోత్సవంతో భారతదేశంలో ప్రారంభమైన నూతన సాంఘిక విప్లవయుగమున కనుగుణముగ కాంగ్రెసుయొక్క, నూతన ఆశయాలు, పునర్నిర్మాణమును గురించి చిరకాలంగా కాంగ్రెసు ఆశయములను ఉద్దేశ్యవిధముగా, అఖిలభారత కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి శ్రీ శంకరరావుదేవ్ గారు చేసిన ప్రకటనకు సంతోషమును వెలిబుచ్చుచు అహింసాత్మక పద్ధతులపై రైతులకు, కూలీలకు, మేధావులకు రాజ్యాధికారమును సంక్రమింపచేసి, అన్ని విధములైన దోపిడి విధానాలను, ఆర్థిక నిమ్నోన్నతాలను తొలగించి, వస్తూత్పత్తి ప్రపంచవిధానమంతా కొందరు వ్యక్తుల లాభాల కనుగుణ్యంగా కాక, అందరు ప్రజలకు లాభదాయక మగురీతిని నడిపింపబడే సోషలిస్టు ప్రజాస్వామికమును కాంక్షించే శ్రీ దేవ్ గారి ప్రకటనలోని ప్రధాన సూత్రములనంగీకరించుచూ, వాటిని అంగీకరించవలెనని, ఈ సభద్వారా అఖిలభారత కాంగ్రెసు సంఘంవారికి శిఫారసు చేయుచున్నారు. మరియు శ్రీ దేవ్ గారు ప్రకటించిన ఆసోషలిస్టు ప్రజాస్వామికంలో సాంఘిక, ఆర్థిక రాజకీయ పరిపాలనాధికారము కేంద్రీకృతమై గాక వికేంద్రీకృతమై ఉండవలెను.

రాజకీయ స్వాతంత్ర్యం సాధింపబడినది కావున విభిన్న దృక్పథాలు కార్యక్రమాలు గల వివిధ పార్టీల వేదికగా కాంగ్రెసు ఇంకనూ ఉండవలసిన అవసరము లేదనీయూ, ఈ నూతన సాంఘిక విప్లవయుగంలో కాంగ్రెసు బాధ్యత లవహించుచున్నది గావున, సుసంఘటితమైన, నిర్మాణాత్మకమైన విధమున ప్రజలను సేవించే రాజకీయ పక్షముగా కాంగ్రెసు మార్పుచెందవలసియున్నది. మరియు కాంగ్రెసుయొక్క ప్రజాస్వామిక ప్రాతిపదికను మరింత విస్తృతపరచుటకు, శ్రమికులైన అందరి సహకారమును పొందుటకు ఈ నూతన పరిస్థితులలో కాంగ్రెసు ఆశయ కార్యక్రమాలను ఆమోదించి పనిచేసే ప్రజా సంస్థలైన అఖిలభారత కిసాన్ కాంగ్రెసు, భారత జాతీయ ట్రేడుయూనియన్ కాంగ్రెస్, చేనేతకాంగ్రెస్, మరి ఇతరవృత్తి సంఘాలకు గాను కాంగ్రెస్ సరియైన నిష్పత్తిలో ప్రాతినిధ్యము నొసగవలెనని ఈ సభవారు కోరుచున్నారు. అని శ్రీ ఓబులరెడ్డిగారు ప్రతిపాదించిరి. తీర్మానం ఆమోదింపబడింది.

## ఆంధ్ర పేపరు మిల్సు

మద్రాసు రాష్ట్రములోకెల్ల ఏకైక కాగిత పరిశ్రమ ఆంధ్ర వాటాదార్ల పెట్టుబడితో, ఆంధ్ర కార్మికుల కాయకష్టముతో గోదావరితీరాన్ని నిర్మించబడి, యుద్ధకాలంలో 5 సంవత్సరములు నెలకు 200 టన్నుల కాగితము ఉత్పత్తి చేసి ఈ రాష్ట్రీ ప్రజల కాగితపుకొరత తీర్చిన ఆంధ్ర పేపరు మిల్సు బుణదాతలపరమై, వారి కత్సిత మేనేజిమెంటులో బుణము ద్విగుణీకృతమై యిప్పుడు హైకోర్టు ద్వారా దివాలాగా నిర్ణయింప బడుతున్నది. ఈ పరిశ్రమను ప్రభుత్వం తక్షణమే కళపరచుగాని 800 కార్మికులకు వృత్తి నిలబెట్టి మన రాష్ట్రీ పరిశ్రమను కాపాడి, ఇది రాష్ట్రేతర పెట్టుబడిదారు పాలుగాకుండా చేయవలెనని ప్రభుత్వమును కోరుచున్నది. ఈ సందర్భమున, ప్రభుత్వమును కలియుటకు ఒక రాయబారమును ఏర్పరచుటకు అధ్యక్షుని కోరుచున్నాము. ప్రభుత్వమీ విషయమును చేబట్టకపోయిన, ఆగము రాష్ట్రీ కాంగ్రెస్ వర్గమువారైనను ఈ విషయము ఆలోచించవలెనని కోరుచున్నాము. అని శ్రీ నీరుకొండ పుండరీకాక్షరావుగారు ప్రతిపాదించిన తీర్మానము అంగీకరింపబడినది.

## ఇతర తీర్మానాలు

అనంతరం సోషలిస్టు ప్రజాస్వామ్యం, మైసూరు సత్యాగ్రహం, ఆంధ్రాపేపరు మిల్సు మొదలైన విషయాలకు సంబంధించిన తీర్మానాలు ఆమోదించబడినవి.

చిత్తూరు జిల్లాలో చెరుకు రైతుల ప్రాణాధారమైన ఆర్థికపంట యిప్పటికి షుమారు 4000 టన్నుల బెల్లం అదనంగా పూరిగుడిసెలలో మురిగిపోతున్నప్పటికి, నవంబరు డిసెంబరు నెలలో కొత్తపంట రానున్నప్పటికి యీ విషయమై ఆంధ్ర రాష్ట్రీ కాంగ్రెసు సంఘం, ఆంధ్రరాష్ట్రీ రైతు కాంగ్రెసు సంఘం పదేపదే ప్రభుత్వానికి బెల్లం కంట్రోలు తీసివేయవలసిన అవశ్యకతను గురించి తీర్మానముల ద్వారా నివేదికల ద్వారా తెలియబరచినప్పటికి ప్రభుత్వం యీ విషయంలో ఏలాటిచర్య తీసుకొనకపోవడం చాల విచారకర విషయముయి యున్నది. ఇప్పటికైనా రైతుల దుస్థితిని గుర్తించి వెంటనే బెల్లం కంట్రోలును తీసివేసి రైతులు ఆర్థిక దుస్థితిలో పడిపోకుండా రక్షించాలని ఈ సభవారు తీర్మానించుచున్నారు.

పి. తిమ్మారెడ్డిగారు ప్రతిపాదించి, న. సత్యనారాయణగారు బలపరచగా యిది అంగీకరించబడెను.

మైసూరులో ప్రభుత్వనిరంకుశ దమననీతిని ఖండించుచూ, ప్రజలకు, సత్యాగ్రహులకు అభినందనములను, సానుభూతిని తెలుపుచూ, ఆంధ్రులందరూ మైసూరు సోదరులకు సహాయము చేయవలెనని కోరుచూ తీర్మానింపబడినది.

ఒక్కస్త్రీకూడా మంత్రివర్గంలో లేకపోగా, ఉన్న ఒక్కస్త్రీ మంత్రికూడా లేకుండా చేయుట ప్రభుత్వమునకు భావ్యము కాదని శ్రీమతి తుమ్మలధనలక్ష్మమ్మగారు ప్రసంగించిరి. వెంటనే ఒకస్త్రీని మంత్రిగా చేసుకొనవలెనని ఒక తీర్మానమును వారు ప్రతిపాదించిరి. తీర్మానమామోదింపబడెను.

ఇదివరకు ప్రభుత్వంవారు చేసిన యుద్ధరుణాలు బ్రిటిషు ప్రభుత్వం తీర్చాలిగాని యీ ప్రభుత్వం తీర్చవలసిన బాధ్యతలేదని స్టెర్లింగు నిలవాలను ఏ మాత్రమును తగ్గించరాదని ఇండియా ప్రభుత్వంవారినికోరుచు తీర్మానించారు.

హరిజనాభివృద్ధికని కోటి రూపాయలు ప్రత్యేకించిన ప్రకాశం మంత్రివర్గాన్ని అభినందించుచు, దానిని యింతవరకు ఉపయోగించనందున చింతించుచు హరిజనులకు వ్యవసాయ కూలీలకు తగినవసతు లేర్పరచవలెననియు వేరొక తీర్మానము అంగీకరించబడెను.

సేవాదళం తీర్మానం, బెజవాడలో ఆంధ్ర హరిజన సంఘం తదితర తీర్మానాలు అధ్యక్షులు ప్రతిపాదించగా ఏకగ్రీవంగా అంగీకరించబడినవి.

గుణుపురంలో ప్రాథమిక కాంగ్రెస్ సభ్యులను చేర్చుకున్నవారిని గుణుపురంలో ఒరిస్సా పోలీసులు అరెస్టు చేయుటను, ఒరిస్సా కాంగ్రెస్ దుష్ప్రచారాన్ని ఖండిస్తు ఆ విషయం విచారించవలసినదిగ రాష్ట్రీ కాంగ్రెస్ సంఘంవారిని యీసభవారు కోరుచున్నారు. అను తీర్మానము అంగీకరించబడెను.

ఒరిస్సా అన్యాయంగా చేర్చబడిన ఆంధ్రప్రాంతాల నూర్పి రాగల సరిహద్దు నిర్ణయ సంఘానికి వాత్యంతయారు చేయుటకు ఒక సంఘాన్ని నియమించవలసిందిగా రా. కాం. సంఘంవారిని కోరుచున్నారు.

కోరాపుట్టి జిల్లాలో కోర్టు భాషగ తెలుగును తీసివేసిన ఒరిస్సా ప్రభుత్వ చర్యను ఖండించుచు, తిరిగి తెలుగు నుద్ధరించునట్లుగ ఒత్తిడి చేయవలెనని ప్రభుత్వంవారిని కోరుచున్నారు.

పై తీర్మానాలుగూడ అధ్యక్షులు ప్రతిపాదించగ అంగీకరించబడినవి.

మంత్రుల చర్యలను పేర్లుపెట్టి ఖండిస్తూ కొందరు తీర్మానాలు పంపించిరనియు, అవి నిరాకరించేయనియు, అధ్యక్షులు చెప్పిరి. కొందరిపై రాష్ట్రీ కాంగ్రెసు సంఘం చెప్పులు రాళ్లు వేయించిందని కొందరు వ్రాసేరనీయు, ఎవరిచర్యలు ప్రజలు గర్హించి అట్లు చేసేరో, వారు తమ చర్యలు సరిదిద్దుకోవాలిగాని, రాష్ట్రీ కాంగ్రెసు సంఘం బాధ్యత వహించలేదనియు, అట్టిలేఖలుగాని సూచింపబడిన తీర్మానంగాని యీ సభ సరకు చేయదని అధ్యక్షులు చెప్పిరి. చిత్తూరుజిల్లాలో 40 గ్రామాలు ముంచేసి చంగల్పటు జిల్లాలో 10 గ్రామాలకు సహాయకారిగా నుండు రిజర్వాయరు కట్టుయత్నమును ప్రభుత్వం వారు నిలుపుచేయాలని కోరుతూ తీర్మానం అనంతశయనం అయ్యంగారు ప్రతిపాదించగా అంగీకరించబడెను.

రంగాగారు రైతాంగానికి, ఆంధ్ర రాష్ట్రానికి చేస్తున్న సేవను ప్రశంసించుచు, వారిని అభినందించుచు వేరొక తీర్మానము అధ్యక్షులు ప్రతిపాదింపగ అంగీకరించబడినపిమ్మట విషయనిర్ణయ సభ 2.10 ని. ముగిసింది.

పోయిన ఉత్సాహం మళ్లీ వస్తుంది.
ఈ వేడిమిలో అధికమైన రోజులలో యింటిపనులు ప్రతి యువతి అభిలషించే యావత్సోత్సాహపు పటుత్వమును నాశనము చేస్తవి. వింకోలా, తన టానిక్ సుణాలతో ఆ ఉత్సాహాన్ని మళ్లీ యిస్తుంది.
జలుబుచేస్తే చాల ఇబ్బందిగావుంటుంది. వుపేక్షచేస్తే జబ్బులోకి దించుతుంది. 'కిలాకోల్డు'తో దానిని ఆదిలోనే అంతమొందించండి. ఇది లిటిల్సు ఓరియంటల్ బాం వారి ప్రొడక్టు.

వేలాం అమ్మకము

ఆవడి (ఆల్మడి) లోని వెహికిల్సు

డిపోవద్ద 280 కుపైగా మిగిలివున్న వెహికిల్సు, దిగువ రకములవి, 1947 సం॥రం సెప్టెంబరు 12, 13 తారీఖులలో ప్రతిదినము ఉదయం 10 గంటలకు ప్రారంభించి, రీజియనల్ కమిషనర్ (డిస్పోజల్సు) సదరన్ సర్కిల్, మద్రాసువారి ఇన్‌స్ట్రక్షనుల ననుసరించి, మద్రాసులోని గవర్నమెంటు ఆక్షనర్లు అయిన గాలీ అండ్ కో వారిచే బహిరంగముగా వేలము వేయబడును. ఫోర్డు 3 టన్నులు 4×2 కన్‌వెన్షనల్ ట్రక్కులు 188; ఫోర్డు 3 టన్నుల 6×4 జి.ఎస్. లారి 1; డాడ్జి 3 టన్నుల 4×2 లారీలు 4; డాడ్జి 15 Cwt ల 4×4 ట్రక్కు 1; 10Cwtల ట్రక్కు 1; చెవ్రలెట్ 3 టన్నుల 4×2 కన్‌వెన్షనల్ ట్రక్కు 1; చెవ్రలెట్ 15 Cwt ల 4×2 జి. ఎస్. ట్రక్కులు3; చెవ్రలెట్ 15 Cwt ల 4×4 వించితో వున్న ట్రక్కు 1; బెడ్‌ఫోర్డు 15 Cwt ల 4×2 ట్రక్కులు 8; మారిస్ 15 Cwt ల 4×4 ఫైర్‌సర్వీస్ 1; మారిస్ 15 Cwt ల 4×2 ట్రక్కు 1; ఆస్టిన్ 3 టన్నుల 4×2 లారీలు 2; ఆస్టిన్ 30 Cwt ల 4×2 లారీ 1; జి. ఎం. సి. లారి 2½ టన్నుల 6×6 వించీలతో 8; జి. ఎం. సి. లారి 1½ టన్ను మొదలు 3 టన్నువరకు 4×4 వి, 8. వివరములతో వున్న లిస్టులు సర్క్యులేషనులో వున్నవి. 375, ఎస్ప్లనేడ్, మద్రాసుకు వ్రాయండి. టెలిఫోను నెం. 3198

భానుమూర్తి భార్య
చలమూరి రచన
వెల 12 అణాలు
PROTIMA BOOKS
49, MUKATHAL ST. VEPERY
MADRAS 7.

అమ్మకమునకు

ఒక సెకండుహాండు రస్టను హార్రి జాంటల్ గ్యాసుయింజను, 144 బి. హెచ్. పి. పనిచేయగలస్థితిలో నున్నది. దానితో అనేక స్పేరు సామానులు నున్నవి. దానిని మా మిల్లువద్ద చూడవచ్చును. కావలసినవారికి యితర వివరములు తెలియపరచుదుము.

శ్రీ సూర్యనారాయణ స్పిన్నింగు అండ్ వీవింగు మిల్సు,
పందలపాక, తూర్పుగోదావరిజిల్లా.

NO LICENCE NEEDED
American MODEL REVOLVERS
PRICES 777–71- 888–81- 999–91

రివాల్వరులు 9 అంగుళ పొడవు 15 ఔన్సుల తూకముకలిగి మిక్కిలి అందముగా చేయబడినవి. ఈ రివాల్వరులు అచ్చమైన అమెరికన్ రివాల్వరులతో సరితూగగలవని ప్రతివారికి తెలియును. 4 అంగుళ పరిమాణముగల 6 గుండ్లు కలిగిన ఆటోమాటిక్ రివాల్వింగు డిస్కును కలిగియున్నవి. దాని భయంకరధ్వని ఎంత ధైర్యముగల దొంగలనైనా ఘాతుక మృగములనైన పారద్రోలగలదు. ఆత్మరక్షణకు భద్రంకరమైన సాధనము.

| | |
|---|---|
| వెల నెం. 777 | రూ. 7 |
| .. .. 888 (కొత్తరకము) | రూ. 8 |
| .. .. 999 (ప్రత్యేక కొత్తరకము) | రూ. 9 |
| ప్రతిదానిలోనూ గుళ్లు కలవు. | |
| అదనపు గుళ్లు – 4 డజన్లు | రూ. 5 |
| రివాల్వర్ లెదర్ బెల్టు 1 కి | రూ. 5 |
| రివాల్వర్ నూనె సీసా 1 కి | రూ. 1 |

(తపాలా–బంగికర్చులు అదనము)

A. C. CORPORATION, SOUTERGANJ, CAWNPORE.

ఇండియన్ బ్యాంక్ లి.
హెడ్డాఫీసు: "ఇండియన్ బ్యాంక్ బిల్డింగ్సు" నార్తుబీచిరోడ్, మదరాసు.
లోకల్ ఆఫీసులు:
మెస్‌ప్లనేడ్, మౌంటురోడ్డు, ట్రిప్లికేన్, మాంబలం, త్యాగరాయనగర్, పరశువాకం,
బొంబాయిలోను, మద్రాసు ప్రెసిడెన్సీలో అన్ని ముఖ్యమైనస్థలాల్లో బ్రాంచీలు సబ్‌ఆఫీసులు కలవు.
విదేశపు బ్రాంచీలు:
కౌలాలంపూర్, పెనాంగు, సింగపూరు.

| | | |
|---|---|---|
| వాటిచేసి, చందా వేయబడిన మూలధనము | రు. | 72,00,000 |
| చెల్లించినమూలధనము | .. | 53,00,000 |
| రిజర్వుఫండు | .. | 62,,000 |

అన్నిరకముల బ్యాంకింగు వ్యాపారము జరుగును.
వివరములకు బ్యాంకుతాలూకు యే ఆఫీసుకైనను వ్రాయండి.
ఎన్. గోపాల అయ్యర్,
IBR/101. సెక్రటరి.

LEPROSY & LEUCODERMA
Acute or chronic - partial or all over the body, treated successfully by our safe sure-world-wide reputed Herbal home-treatment in four weeks Particulars on request, Please Correspond in English.
KAMALA WORKS (A. P.)
Panchpota, Bengal.

ఉబ్బసం (దమ)
ఉబ్బసవ్యాధికి "లక్ష్మణమూర్తి" 30-9-47 పూర్ణిమనాటిరాత్రి ఒకమోతాదు సేవించినచో విశేషముగా కుదురును. జాబులు ఇంగ్లీషులో వ్రాయుడు.
MAHATMA SREE JANAKI SEWASHRAM
(P. O. CHITRAKOT U. P.)

మదనకామేశ్వర లేహ్యం
ఇది మేహములు, విక్కాక, విచ్ఛిత్తిన శుక్లనష్టము అతిమూత్రము మొదలగువాటిని ఖండించి, మంచి బలమును వీర్యపటుత్వమును కలిగించుటలో అద్భుతమయినది 2 డబ్బీలు చాలును,
20 తులముల డబ్బి రు 2/– పోస్టేజి ప్రత్యేకము.
పి. శి. ఏ. అండ్ కంపెనీ,
ఆయుర్వేదసమాజం, పెరిదేవి (నెల్లూరుజిల్లా.)

SUNSHINE Glaxo
సన్‌షైన్ గ్లాక్సో
బిడ్డలను బొద్దుగా పెంచును
ఇండియాలో డిస్ట్రిబ్యూటర్లు:
హెచ్. జె. ఫాస్టర్ అండ్ కో, లిమిటెడ్.
బొంబాయి. కలకత్తా. మదరాసు, లాహోరు.
శిశురక్షణవిధులు గురించిన పుస్తకము 4 అణాల స్టాంపులకు పంపబడును. పేరు, అడ్రసు పెద్ద అక్షరములతో దిగువచోటికి వ్రాయుడు. హెచ్. జె. ఫాస్టర్ అండ్ కో, లిమిటెడ్. పోస్టుబాక్సు నెం. 202, బొంబాయి

కాగడా బ్రాండు డిడిటితో దోమలబాధను తొలగింపుడు!

కాగడా బ్రాండు డిడిటి చల్లబడిన భాగమునకు అంటుకొనిన గాని, లేక దాని పిచికారి దెబ్బతగిలిన గాని దోమలు నశించును.

కాగడా బ్రాండు డిడిటి అన్నిచోట్ల దొరకును. వెలుగుచున్న "కాగడా" గల నలుపు పసుపు వర్ణపు లేబిలునే కోరుడు.

కాగడా బ్రాండు డిడిటి కీటకములను ఎట్లు చంపును

గోడలు, సీలలు, పైకప్పులు, సరంజామాలపై కాగడా బ్రాండు డిడిటిని పిచికారిచేసినచో అది కంటికగుపడని ఒక పొరగా నేర్పడి దోమలను మరి ఇతర గృహసామాన్య కీటకములను నాశనము చేయును. ఈ పొర, వారములే కాదు నెలలవరకు కూడ కీటకనాశనశక్తిని నిలుపుకొని యుండును.
దోమ, ఈగ, నల్లి, చీమట, బొద్దింక, పేను మొదలగువానిలో దేనికైనను దీని పిచికారి దెబ్బతగిలినను, లేక ఇది పిచికారిచేయబడిన భాగములకు అంటుకొనినను, అవి తప్పక నశించును. ఈ ఆశ్చర్యకరమగు నూతన కీటకనాశని యొక్క ప్రయోజకత్వము మీకు వాడినచో తెలియగలదు. ఈ రోజునసే ఒక సీసాను కొనుడు.
పడుకొనుటకు ముందు మీ గదిలో సరిగా రెండు పర్యాయములు మాత్రము ఈ డిడిటిని పిచికారిచేయుడు. ఇక రాత్రియంతయు దోమలు దగ్గరకు రావు.

టార్చి బ్రాండ్ డిడిటి
తయారుచేయువారు: ది ప్రోగ్రెసివ్ కెమికల్ కార్పొరేషన్ లిమిటెడ్.
సోల్ అమ్మకపు ఏజంట్లు: ది తాతా ఆయిల్‌మిల్సు కంపెనీ లిమిటెడ్.

Edited, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, G. T. Madras.